ఓం గం గణపతయేనమ:

భ్రామరీ 17-8-2006

శా|| శ్రీమాతామమతానురాగమయిధీశ్రీమంతినీశ్రీకరీ
మామాకర్మలనీవెరుంగుదుకదేమంత్రాక్షరీమానదా
కామేశాత్మసురూపణీయమలినీకామేశ్వరాహ్లాదినీ
కామేశీకనుమామమున్సకలసౌఖ్యాంశమా భ్రామరీ|| 1

శా|| స్వర్గాసౌఖ్యము కల్గజేసి మదియాశాపాశమున్ ద్రుంచియా
దర్గామార్గము జూపి నాహృదినచింతాశల్యమున్బాపి నీ
దర్శన్భాగ్యమునిచ్చి వంశమభివృద్ధ్యందంగనెప్డున్వరా
మర్శావీక్షణతోడ రక్షగలగన్ మన్నించుమా భ్రామరీ|| 2

శా|| సాక్షాన్నీవెసురక్షయంటిమధురాక్షాలంకృతాలంబికా
అక్షీణంబగుశక్తి నీయమని నేనారాధనల్జేసితే
రక్షాదక్షసుభిక్షవీక్షణలచేయార్ద్రంబుగావించి నా
లక్ష్యమ్మంతయుతీర్చి గౌరవముకల్గించెప్పుడున్ భ్రామరీ|| 3

శా|| నీవేశక్తివి దేవతా తతులకున్నీరేజ పత్రేక్షణా
నీవాల్లభ్యము చేతనే నలువతానీ సృష్టిచేయున్సదా
సేవాభావముతప్పనమ్మ మదిలోక్షేమంబుయోజించుచున్
కైవల్యంబునుయిచ్చికావగదవే!కాత్యాయనీభ్రామరీ|| 4

శా||శైవారాధ్యుడురావణాసురుడునీశక్తేమిటోతెల్యకనే
కావాలన్చునుకోరియోడె!తనలోకాలుష్యభావంబుచే
నీవోబాలనితల్చెదున్నమదిలో!నిత్యార్థనిర్ధారిణీ
కైవల్యంబునుయిచ్చికావగదవే!కామేశ్వరీభ్రామరీ|| 5

12-7-2010

శా|| కల్యాణీయుడురాజబింబవదనాగంధేభకుంభస్తనీ
కల్యాణోత్సవకారిణీకమలినీ కామ్యార్థసంధాయినీ
కల్యాణంబదికల్గజేయుమిపుడున్కల్యాణగౌరీమదిన్
కల్యాణాత్మకశైలవాసిని శివా కామేశ్వరీ భ్రామరీ|| 6

శా|| ఏణాక్షీసమయయానురక్తిని! సతీ ఏకార రూపాక్షరీ
వీణాపాణివిధిప్రియాంశలలనా యీశాన తన్వర్థినీ
ప్రాణాధారవచాంశి!భాస్వతి!పరా!భావానుకూలాంశి!శ
ర్వాణీవాక్ఝరి!యాదరించుమముగీర్వాణీప్రభాభ్రామరీ|| 7

శా|| ఈక్షిత్రీవనతెల్పితీవుగుహలోనిక్షిప్తశక్తంచు యో
సాక్షీభూతదయావిశేషవరదా!సామాన్యులేలొందునిన్
దీక్షాబధ్ధులుమౌనులందరలనిన్వీక్షించతల్త్రిప్పుడున్
దక్షధ్వంశిసిరక్షయిమ్ముయిపుడాధారంబువై భ్రామరీ|| 8
(శంకరభాష్యమ్ :-ఈక్షిత్రీ=ఉదాసీనదృష్టి సాక్షిణీ
అసంగ=ఉదాసీనజ్ఞానస్వరూపేత్యర్థ: "సాక్షీ చేతా" ఇతిశృతే:
"ఆవివి: సంనిహితమ్ గుహాయామ్" ఇతిశృతే: ఓం ఈక్షిత్ర్యైనమ:)

శా|| లక్ష్మీమ్మీవె గదా రమాదిలలనాలాలిత్య లావణ్యమా
దాక్షిణ్యాంశి!సదాశివాత్మ లలితా ధర్మస్వరూపా!ధనా
ధ్యక్షాసవ్యమతస్వరూపిత పరా ధ్యానాంశినీయోగదా
సాక్షాచ్ఛ్రీశివరూపమీవె!సకలా సౌందర్యదా భ్రామరీ|| 9
సవ్యమతము&అపసవ్యమతము అనగా దక్షిణాచారమువామాచారము
సవ్య=దేవయానము అర్చిరాదిమార్గము.మోక్షార్థులు పొందదగినది.
అపసవ్య=పితృయానము ధూమాదిమార్గము ప్రవృత్తిపరులు(ఐహికపరులు)
పొందదగినది. ఈవిషయము బహు విస్తృతమైనది మతములవిషయ తెలిసిన
గాని యర్థముగాదు.లలిత సహస్రనామములకు అర్థము తెలిసినచో యీ
విషయము పూర్తిగా అర్థమగును.నక్షత్రముల 3 విధాలు విభజించి సవ్య=కుడి

అపసవ్య=ఎడమ , మార్గ=మధ్యమార్గము  ఈవిధీముగా విభాగించి వాటిని యేవిధముయాచరించవలునోకూడ తెలియజేసినారు పూర్వ ఉపాసకులు కావున యీవిషయముతెలియవలెనన్నచూడు సౌ.భా.భా.

శా|| హ్రీంకారమ్మదినీదుయాసనమునౌ హ్రీంకారరూపా యుమా
హ్రీంకారైకపరాయణా సమరసా హ్రీంకార బీజాక్షరీ
హ్రీంకారోజ్వల లక్షణా !పరశివా!యింద్రాదిసంసేవితా
హ్రీంకారాంగణదీపికామభయదా హ్రీంహ్రీంజపా భ్రామరీ|| 10

**1 పంచదశీ మంత్రప్రథమకూటము6 నుండి 10వరకు**

శా|| హత్యాపాపశమంబునీవెగదహాహాహాహాస్తుత్యాయజా
సత్యాసత్య విశేషమార్గగమనీ సర్వాంగసౌందర్య ధీ
నిత్యానిత్య పదార్థరూప నిగమా నిత్యార్థ నిర్దేశినీ
ప్రత్యగ్రూపవిలాసినీభగవతీ ప్రాజ్ఞాత్మికా భ్రామరీ|| 11

ప్రతికూలం అంచతీతి ప్రత్యక్ తాదృశం రూపం యస్యా:
=అనగాప్రతికూలమైనగతిగలది.ఇంద్రియములు విషయోన్ముఖమగుట బహిర్ముఖత్వము. అదియే పరాఙ్ముఖత్వము,లోనికి ఆత్మకొఱకై త్రిప్పుట అంతర్ముఖ, అదియే ప్రత్యఙ్ముఖత్వము.
ప్రాజ్ఞాత్మికా=ప్రాజ్ఞా ఉక్తలక్షణా: జీవా: తత్సమిష్టిభూత ఈశ్వర ఆత్మా స్వరూపం యస్యాస్సా ప్రాజ్ఞాత్మికా=పూర్వముచెప్పబడినలక్షణములు గల జీవుల సమిష్టిభూతమైన ఈశ్వరునియొక్క ఆత్మ(రూపము)గలది.
వ్యష్టిజీవుడు(ప్రాజ్ఞుడు)సుప్తుడు సమిష్టిభూతమైన ప్రాజ్ఞాత్మ(ఈశ్వరాత్మ) యే రూపముగా గలది దేవి.

శా|| సర్వోత్కృష్టపదంబునీవ!యమలా సాహిత్యసౌభాగ్యదా
సర్వార్థంబులనిచ్చుసత్వగుణశాస్త్రార్థమీయంగదే
సర్వాభీష్టవరా!స్వధా!సమరుచీ సంపత్కరీ శ్రీమతీ
సర్వైశ్వర్యప్రదా రమా స్తుతిమతీ సర్వేశ్వరీ భ్రామరీ|| 12

శా|| కస్తూరీతిలకోజ్వలా కమలినీ కారుణ్యవర్షాంబుధీ
వస్తూత్పత్తినిధీ వరరుచీ!వాగ్దాయినీ వ్యాపినీ
శాస్త్రాద్యాదులనీయవే ఫలనిధీ శాంతా సుసౌమ్యా సుధీ
అస్తోకంబదినీదుశక్తి!జననీ తత్వాసనా భ్రామరీ|| 13

శా|| హర్యక్షాసన హాకినీ హరసతీ హర్షాంబుధీ ధీనిధీ
హర్యశ్వాద్యమరార్చితా సకలవాగ్వేలావిలాశేశ్వరీ
శౌర్యాలంకృతవేషిణీ యనుపమా శాంతాసనస్థా శృతీ
కార్యాకార్యఫలాంశినీ సుఫలదా కామ్యార్థదా భ్రామరీ|| 14

శా|| లక్ష్మీవాణులసేవలొందెదవుయోలక్ష్యార్థమీవిచ్చుచున్
సూక్ష్మాంశంబులనందిసృష్టిసలుపున్సార్యాదిశక్తుల్సదా
సూక్ష్మాసూక్ష్మ వివేక కార్యఫలమౌ శోభాంశమీవేగదా
ఈక్ష్మా శక్తివినీవె భక్తతతులన్వీక్షించుమో భ్రామరీ|| 15

శా|| హ్రీంజప్యంబునతృప్తినొందెదవుగా!హ్రీంకారమేగేహమౌ
హ్రీంజన్మస్థలమయ్యెయోగినులిహ్రీంకారమున్నొందుటన్
హ్రీంజప్పుడ్సకలేషి-గా గణనుడౌ హ్రీంకారిణీ హ్రీంమతీ
హ్రీంజప్పుల్సములౌనుదివ్యపథమున్ హ్రీంహ్రీంజపాభ్రామరీ|| 16

**పంచదశీమంత్రద్వితీయకూటము 11నుండి 16వరకు**

శా|| సత్యాన్వేషణనీకృపాంశమగునోసత్వాంశినీజ్ఞానదా
నిత్యోన్మేషణశక్తినీవె విరజా నిర్నాశినీ నిర్మలా
అత్యావేశపరుల్మునీంద్రులగుదుర్వాసాది విజ్ఞానిధీ
సత్యస్తత్వనిధీసకాలగమనాసాధ్వీమణీ భ్రామరీ|| 17

శా|| కర్మాగారమునీజగంబు మదినీకర్మాదులేవిజ్ఞచే
మర్మంబెర్గవలెన్యెరుంగనమలా మార్గంబదేమో?సుమా
మర్మంబెర్గగదారిచూపుముసుసౌమన్యాంశినీధర్మిణీ

ధర్మోపాయముతెల్పెనీదరికిరధ్యామార్గమీ భ్రామరీ||   18

శా|| లబ్ధమ్మేవెనిధీవె సాధ్యమగునేలబ్ధార్ధమెర్గంగ?మా
లబ్ధైశ్వర్యమునీవె రమ్యగుణలీలా లక్షణా లేఖినీ
లబ్ధాంశమ్మునునీవె సౌఖ్యపథమాలంబమ్మునీవేకదా!
లబ్ధార్ధమ్ముకునీవెతల్లివి విశాలాక్షీ ధృతీభ్రామరీ||   19

శా|| హ్రీంమంత్రమ్ముశివాత్మకమ్ముహరఈంహ్రీమయ్యోయీమార్గమం
దీంమంత్రమ్మనుశక్తితోకలసిశాక్తేయంబునౌనందురే
హ్రీంమంత్రంశివశక్తులాశ్రయమె!మాహేంద్రాదిసంసేవితా
హ్రీంమంత్రస్థలవాసినీభగవతీహ్రీంహ్రీంజపాభ్రామరీ||   20

**పంచదశీమంత్రతృతీయకూటము17నుండి20వరకు**

శా|| హస్తమ్మందునపాశముంచుకొనెదోహస్తమ్మునాశీశ్శుల
న్నిస్తున్నట్లుగనాకుదర్శనమదిన్నిచ్చేవు రక్షించి నీ
యస్తిత్వమ్మునుచూపినావు కుశలా ఉత్మానాత్మవిజ్ఞానదా
నిస్తంత్రమ్మునదుర్వినీతిసములన్నిర్జించుమో భ్రామరీ||   21

శా॥ ఐంబీజాక్షరవాసినీ సకల వాగైశ్వర్య సంవర్ధినీ
అంబోజాసనదేవతాదిగణ సేవల్పొందితృప్తాంది తీ
వంబా! నీకృపనాపయిన్నరచి నీవాత్సల్యసౌఖ్యంబుచే
సంభాషించి సదాపదాబ్జనికటాశల్తీర్చుమో భ్రామరీ॥   22

శా॥ క్లీంవిద్యాపర దేవతా! సురతరోర్లిప్తాంకసింహ-సినీ
సంవిత్తాంశిని రక్తవర్ణరుచిరా చాపాంకుశోద్భాసినీ
సంవాత్సల్యహృదీ కపాలధరి బీజాపూరహస్తోజ్వలా
సంవేద్యామమలాంభజే! యచుణదా శైలాత్మజా భ్రామరీ   23

శా॥ **సౌభాగ్యోదయకారిణీయమర భాషౌచిత్య భావాంబుధీ**
స్వాభావామృతభాండహస్త వరదా స్వాతంత్ర్యసంపత్కరీ
నాభావమ్మునినిన్నునిల్పెదను నానాశత్రు విధ్వంశినీ
నీభావోన్నతినాకుయిమ్మనికనో నిర్ణాయకీ భ్రామరీ॥ 24

శా॥ ఐశ్వర్యమ్మును కల్గజేయగల యేకైకోత్తమౌ శక్తివై
విశ్వారాధ్యపథంబునీవెయయిసర్వేశానివైయున్న నీ
విశ్వాసమ్మునుపొందుమార్గమునునీవీయంగనర్థింతునో
విశ్వేశాని విశేష వీక్షణకరీ విశ్వేశ్వరీ భ్రామరీ॥ 25

శా॥ **హ్రీంకారేశ్వరి**శార్వరీశరణమోహ్రీంశక్తి దుష్టాత్ములన్
హుంకారమ్మునపారదోలిసభనాహూతుల్యగీమాన్యులన్
హంకారమ్మదికల్గకుండనిలుపోహంసాసనా హ-కినీ
హ్రీంకారాసనగర్భితానలశిఖాహ్రీంహ్రీంజపాభ్రామరీ॥ 26

శా॥ **శ్రీ**నారాయణవక్షమందునిలువన్శ్రీమంతుడయ్యేన్గదా
~~ఈ~~నాడీజనమాన్యులంత తమరాశీర్వాదమాకాంక్షతో
నానాపూజలుసల్పిభిక్షకొరకైనాశించులక్ష్మిన్సదా
నానాశక్తులునీదురూపమగునోనానార్థదా భ్రామరీ॥ 27

శా॥ **క్రీం**కారాశ్రయనీలవర్ణరుచిరా కీలాలపానప్రియా
జంకేలా నినుగొల్వ జాంగలి జయా జాలంధరీ చండికా
టంకారధ్వనినీదువాక్కునిలయడ్డంకేమిలేకుండ యో
ఘీంకారమ్మయివ్యాప్తిచెందరిని లంకించంగనో భ్రామరీ॥
( కీలాలం=నెత్తురు,నీళ్ళు। జాంగలి=నిర్విష,విషమునుపోగొట్టునది
లంకించు=పెనవేయు,అవమానించు ) 28

శా॥ క్రీంమంత్రమ్బ్రహ్మవిష్ణురుద్రగుణమైక్రీడావినోదార్థియౌ
క్రీంమంత్రాశ్రయశక్తి కాళికళసంకేతంబునైయొప్పెడున్
క్రీంమంత్రమ్ముజపించనెప్పుడునుసంక్షేమంబుకల్గింతువో
క్రీంమంత్రస్థితభద్రకాళిజనసంకీర్ణమ్ముబకున్ భ్రామరీ॥ 29

శా॥ సర్వాభీష్టవరమ్మునీయుమికసత్సంకల్పమిచ్చెప్పుడున్
పూర్వాచారపరాయిణీపురహితాపూజ్యాపురాధీశ్వరీ
సర్వాపద్వినివారిణీసుఖకరీసౌందర్యసారాంశినీ
సర్వావస్థవివర్జితామమలవాక్సంధాయినీ భ్రామరీ॥ 30

ఓం హ్రీంశ్రీంక్లీం భగవతి మాహేశ్వరి అన్నపూర్ణే స్వాహ-

శా॥ **ఓం**కారేశ్వరిచంద్రశేఖరిగిరీశోత్సాహినీ గీష్పతీ
సంకల్పంబుననిల్చిసృష్టిసలుపన్యాసించిసత్సంతుని
శ్శంకన్నిత్తువనెంచిభక్తజనమాశల్తో నిరీక్షింతురే
వంకన్జూచిననిన్నువీడడగనెవ్వారుండిరే?భ్రామరీ॥ 31

శా॥ **హ్రీం**కారాంగణదీపికామనసు లోహ్రీమన్నునుండంగనా
హంకారమ్మదిసర్వనాశమగునోయాహ్లాదినీచంద్రికా
శంకేలాయికయన్నపూర్ణనినుయాశల్తీరనర్థింతు నా
వంకేయుండుముశతృనాశని సదావాత్సల్యదా భ్రామరీ॥ 32

శా॥ **శ్రీం**బీజాక్షరమందులక్ష్మికళగాసిద్ధింతు వీక్షించగా
సంబాళించుచుకల్కదీర్చిమరినీసమ్మోదమిప్పించవే
యంబామాకిటశత్రుకూటములమాయల్బీల్చిచెండాడుచున్
సంబారమ్ములనియ్యవచ్చికనుమోశాకంబరీ బ్రామరీ॥ 33

శా॥ క్లీంకారాశ్రయరక్తవర్ణకిరణోల్లేఖీప్రబోధాయినీ
పంకేజాసన భావనాంశిని పరా ఫాలాక్షి భక్తప్రియా
ఱంకెల్వేసెడిరాక్షసాధములసంగ్రామంబునందణ్చిమా
సంకెల్వీడగజేసితేపరశివా సౌహ-ర్దినీ భ్రామరీ॥ 34

శా॥ భక్తాధీనపరాయణీ భగవతీభద్రేశ్వరీ భార్గవీ
శక్తీవన్చు సదామనంబుననిరాశల్వోవనర్థింతునో
ముక్తా హారవిభూషితాస్థుతిమతీముక్తీశ్వరీశాంకరీ
భుక్తాభుక్తపదార్థసిద్ధధని శంభోర్మానసీ భ్రామరీ॥ 35

శా॥ గంగేయాదిసురాసురాదులకుభోగంబిచ్చుదేవీవె ఆ
గంగాదేవిసపత్నిగాకనునమోఘంబైనసాధ్వీమణీ
కంగారేమియులేకగొల్తుమికనోకామేశతన్వర్ధినీ
లింగాలింగిత లింగధారి లలితా లీలాసనా భ్రామరీ॥ 36

శా॥ తీర్థాలన్నియునీదుపాదములముందేయున్నవన్చెంచితీ
యర్థాలన్నియునీపదాబ్జమునలభ్యంబౌనుభక్తాళికిన్
వ్యర్థంబన్నదిలేదునీకడపరార్థ్యంబన్ననీసేవలౌ
అర్థజ్ఞానమునిమ్మదేవిమధురోత్సాహమ్ముతో భ్రామరీ॥ 37

శా॥ మాయామోహితజీవులైతనియరేమార్గంబునందిచ్చుటన్
యాయాశల్వలలోనచిక్కినినుకానన్తల్చరింతేనియున్
మాయానాటకసూత్రధారివగు యీమా యాతనేవిద్యతో
మాయమ్మైచనునోనదిమ్మునికనీమంత్రమ్ముగా భ్రామరీ॥ 38

శా॥ హేమాద్రిందువసింతువన్దురకద యాహేమాద్రికానంగలే
మే?మాయమ్మవునీవెతెల్పవలెమేమేమోమదూహింతుమే

నీమాహల్నిక చేరవల్ననిన మాణిక్యాల దీపంబువై
యేమార్గమ్మునుయాచరించవలెనోతెల్పిప్పుడో భ్రామరీ॥ 39

శా॥ శ్వశ్రేయస్సునుగోరినీపదమువిశ్వాసమ్ముతో ౘొల్చితో
నిశ్రేయస్సునుకల్గజేసిననునోనిష్ణాతునిన్జేయచున్
విశ్రామమ్మునయిస్తునీదుపదమున్వీక్షించుసౌభాగ్యమి
చ్చాశ్రీశైలమునందునుండునటులాశన్తీర్చుమోభ్రామరీ॥ 40

శ్వశ్రేయసము= శుభము,సుఖము,మోక్షము.విణ. శుభకరము.
నిశ్రేయసము= ముక్తి,మేలు,పుం.డు.శివుడు.
విశ్రామము= ఊరట,విరామము, పద్యవిరామము.
శ్రీశైలము=శ్రీశైలముకైలాసము, యోగసంపత్కరశైలము.

శా॥ రిత్తల్గావుగదాముమీందుర్లగువారిచ్చేటిదీక్షాదులీ
చిత్తమ్మందున శాంతిపొందవలుపాసించేటి వారెప్పుడున్
వృత్తేదైనను కొల్వవచ్చునిను నివృత్తైచనన్కోర్కెలీ
మత్తేభంబగుచిత్తమేవిధినిసమ్మార్జింతువో భ్రామరీ॥ 41

సమ్మార్జనము=శోధనము;సమ్మార్జని=చీపురు,శోధని.

శా॥ అన్నంబిత్తువు సర్వజీవులకు సర్వార్థంబులిచ్చెప్డునీ
కన్నన్లేరెవరీవిధంబుగను యోకారుణ్య చిత్తాంబుధీ
పున్నెంబెంతయొయున్ననిన్తెలియునైపుణ్యంబుసిద్ధించు నీ
సాన్నిధ్యంబునుయిమ్ముదేవిసకళాసౌహార్దినీ భ్రామరీ॥ 42

శా॥ నందీశామలవాసవాదిసురలానందోత్సవోత్సాహులౌ
సందోహాప్సరకిన్నరాదిమునిరాసంకీర్ణ సంపూజితా

సందేహమ్ముమనుతీర్చిమిత్రసహితా సంప్రీతికల్గించుమో
సందేశమ్ముమనుయిచ్చిమమ్ముగనవేసంతోషిణీ భ్రామరీ॥ 43

శా॥ నక్షత్రేశు నగేశులాది ఖచరాణ్చక్రేశు వాగీశు లా
లక్ష్యమ్మంతయునీదుపాదములనే లక్ష్యమ్ముగానెంత్రు నీ
వీక్షా ఉకాంక్షను వీడలేక సలుపోవేడ్కోలు విశ్వేశ్వరీ
మాక్షేమంబదినీదుకార్యమగునోమంత్రాక్షరీ భ్రామరీ॥ 44.

శా॥ పూర్ణంబైచనునీదువీక్షణలచేపూర్వంపుకర్మాదులో
పూర్ణచంద్రముఖీయుమా సమరసా పూర్ణా పురారిప్రియా
స్వర్ణాలంకృతభూషణీసరస వాక్సంధాయినీ సాహితీ
వర్ణాలన్నియునీదురూపములగోవాత్సల్యనీ భ్రామరీ॥ 45

శా॥ రెప్పల్పాటుననున్నకన్నువలెనిర్ణీతంపురక్షిత్తు వో
యప్పానీపదపీఠమందుననునోభాగంబుగాజేయుమా
తప్పుల్లేకనుజీవితానకనుమీతాత్కాలికంబైననీ
మెప్పుల్లేని సజీవపోరునిక కామేశాశయా భ్రామరీ॥ 46

శా॥ ణా యక్షరంతొపదాలులేవు యబుణ్ణై" ణా" నిల్చివీక్షించగా
నోయమ్మావినుమాసుబోధకరణీయోంకారిణీపార్వతీ
నీయాజ్ఞేకదయాపదాలబలమున్నీవంతె కాదా? శ్రుతీ
మాయాకష్టములన్ని దీర్చుమిపుడోమాహేశ్వరీ భ్రామరీ॥ 47

శా॥ స్వామ్యమ్మన్నదిలేదుమాకెపుడునీస్వామిత్వమేచెల్లు మా
కామ్యాలన్నియుతీర్చనీవెసరియోకామేశ్వరాలింగితా
గమ్యమ్మేదియొతెల్పిమార్గమునుమాకందించిరక్షించవే
గమ్యాగమ్యవిచక్షణా ఉగణితవాగైశ్వర్యదా భ్రామరీ॥ 48

స్వామ్యము=సొంతము( అష్టవిధములు-విక్రయ,దాన,వినిమయ,
జల,తరు,పాషాణ,నిధి,నిక్షేపములు)

శా॥ **హ**-యిన్గూర్చును నీదుహ-సమది యోహర్షప్రదా హ-కినీ
మాయామోహితసంద్రమందుమునిగేమార్గమ్ముకాన్పించకే
సాయమ్మంటి యసాధ్యసాధ్యమగుశాస్త్రజ్ఞానమీవిచ్చి యీ
కాయమ్మందుననున్ననాళ్ళు కనుమోకాత్యాయనీభ్రామరీ॥ 49

శ్రీమాతా
శా॥ **శ్రీ**శాధీశసురాధినాధగణముల్సర్వమ్మునీచూపుకై
యాశాదృక్కులతోనిరీక్షణలచేయజ్ఞంబుసల్పంగనీ
వాశీర్వాదమునిచ్చివారికలయాశల్తీర్చితోశాంకరీ
యాశాశాసని ధీమతీ పరమకళ్యాణీ ధృతీ భ్రామరీ॥ 50

శా॥ **మా**హేశానిసకాలవిజ్ఞఫలదామాధుర్యవాగర్థధీ
మోహ-తీతకలా సతీ యగణితా మోహమ్ముతొల్గించుమా
మాహేశాశయమర్మిణీకరుణతోమమ్మేలుకోమధ్యమా
యాహ-యేమనికొల్తునిన్నువరదాయాశిస్సునీ భ్రామరీ॥ 51

శా॥ **తా**రాకాన్తితిరస్కరీ మృదు లతాతన్వీ మనోల్లాసినీ
పారావారగభీరముద్రసకలోపాయాధ్వరీపాహిమాం
ధీరాధీర విలాసినీ సకల వైద్యేశాని ధీమంతినీ
వైరాగ్యోద్భవకారిణీ ధృతిమతీ వైశేషికీ భ్రామరీ॥ 52

శా॥ వీణాతంత్రులమీటనాదమదియేవిద్దిన్ప్రకంపించునా
వీణానాదమువోలెమానసమునన్విన్పించులీనధ్వనో
వాణైసాగుమనోపథంబునసదా ఉవాగ్ధారె నాదాంతమై

పాణీపీడనతోన్సమాధి (నిలుపో భావించగా భ్రామరీ॥ 53

శా॥ హృల్లేఖంబుననున్ననంశములవూహించంగపన్నెండగో
తల్లీ యున్మనిదాక లెక్కనరయన్ధారన్నిధానించగా
సల్లీలన్గలుగర్థచంద్రమొదలాసంఖ్యావిశేషంబుతా
ముల్లే-ంచగ గాంచవచ్చునవి నిర్మూర్ఘులై భ్రామరీ॥ 54

హ్రీంబీజమును హృల్లేఖ యనందురు యీబీజమున 12అంశములున్నవి
వానిలొ 3 అక్షరములు 9 బింద్వాది నాదసమిష్టితోజనించినవి యగును
1హ్ 2 ర్ 3 ఈ 4 ం బిందువు 5 ౘ అర్థచంద్ర 6 రోదినీ 7 నాదం
8 నాదాంతం 9 శక్తి 10 వ్యాపిక 11 సమనా 12 ఉన్మని అనునవి.
( ఈవిషయమును పూర్తిగ తెలుసుకొనవలెనన్న వరివస్యారహస్యమును
చదివినచో అర్థమగును)

శా॥ నీసాన్నిధ్యముకోరువీరుడగువానిన్గార్చిశోధించుచో
నాసాగ్రమ్మునదృష్టినిల్పిసలుపో ఉసాధ్యంబునౌసాధనల్
యాసామాగ్రినిపొందునర్థితులు మాయామోహితుల్యేలగున్
యోసాధ్యా!యసమానపీఠమిడుమాయోంకారిణీ భ్రామరీ॥ 55

శా॥ మంత్రాధీనులుదేవతాదులగు యామంత్రమ్మునీవేకదా
యంత్రాధీనముమంత్రశక్తి కననోయజ్ఞానవిధ్వంశినీ
తంత్రాధీశ్వరితారిణీ సకలతత్వార్థమ్మునీవిస్తు ని
స్తంత్రజ్ఞానుని తంత్రయంత్రముల శాస్త్ర్యర్థమ్మునీ భ్రామరీ॥ 56

**త్రిపురా**

శా॥ **త్రిస్థానాధిపతీ** సతీ ద్యుతిధరా దీర్ఘాయుదా ధీనిధీ
ప్రస్థానత్రయసారమంతయునునీప్రస్థావనేయందు నీ

యాస్థానాశ్రయమీయవేడితినియాశాశాసనీ శాశ్వతీ
స్వస్థా  స్వస్తిమతీ స్వధా శరనిధీ సామ్రాజ్యదా భ్రామరీ॥ 57

శా॥ **పు**ణ్యాపుణ్యఫలప్రదా పురహితా పూజ్యా ప్రసిద్ధా పరా
గణ్యాగణ్యవిశారదా హరసతీ గాంధర్వ గానప్రియా
పణ్యాపణ్యగుణీ నమో హితకరీ భ్రాహ్మీప్రభారూపలా
వణ్యాంగీ రమణీ రతీ రసమయీవాగ్వాదినీ భ్రామరీ॥ 58

శా॥ **రా**కాచంద్రముఖీప్రశాంతవదనారమ్యాంశలావణ్యమా
యేకాకీ కమనీయరూపతరుణీ యేకాక్షరీంకారిణీ
యేకాంతమ్మునసీదుపూజసలుపన్దేవీకటాక్షింతువే
సాకారమ్మునుదాల్చినిల్పుమికనోసర్వాత్మికా భ్రామరీ॥ 59

శ్రీవిద్యా

శా॥ **శ్రీ**శైలేశసతీశ్రుతీధృతిమతీసిద్ధేశ్వరీచిన్మయీ
కాశీక్షేత్రనివాసినీ కలనిధీకామేశ్వరాత్మానమో
రాశీభూతదయాస్వరూపరమణీరమ్యార్థసంవర్థినీ
యాశాశాసని శాంతచిత్తతరుణీ యానందినీ భ్రామరీ॥ 60

శా॥ విశ్వమ్మంతయునిండియున్ననినునేవిద్యన్నెరుంగన్సదా
విశ్వాసమ్మునపూజసేతుమనమువ్విశ్వేశ్వరాహ్లాదినీ
విశ్వప్రీతికరీ విశేషతిలకా వీరేశ్వరీ వీర్యదా
విశ్వాత్మా విరజాజితేంద్రియసతీవీక్షించుమా భ్రామరీ ॥ 61

శా॥ **ధ్యా**నాధ్యానవిధానదాతవిజయాతారాధిపారాధితా
స్థానాస్థానవివేకవైఖరిపథా ఉస్థానాశ్రయాపాహిమాం

నానా ఉస్థాన విశేషవిద్యరుచిరా నాకేశ  సంసేవితా
శ్రీనాధాదిసురాధినాయకగణా ఉస్తిత్వదా భ్రామరీ॥ 62

**గాయత్రి**

శా॥ **గా**నమ్మందునతృప్తినొందెదవుగాగానామృతాస్వాదినీ
నానాదేహధరా శివప్రియకరీ నారాయణీ నాయకీ
నానాజీవనమార్గదాయి నిగమా నానార్థసంపత్కరీ
నానారత్నవిచిత్రశోభలతికా నాకేశ్వరీ భ్రామరీ॥ 63

శా॥ **య**జ్ఞేశానియశస్కరీరిపుహరీయజ్ఞాంశినీయోగదా
యజ్ఞస్థా యజమాని యజ్ఞనిలయా యాదృశ్యయర్థజ్ఞదా
ఆజ్ఞాచక్రనివాసినీ నియమనిష్టార్థస్వరూపా నిధీ
విజ్ఞానీ నిగమార్థదాయిని విధీ విద్యేశ్వరీ భ్రామరీ॥ 64

శా॥ **త్రి**స్థానంబులపూజనీయవు నియంత్రింతీవులోకమ్మునీ
యాస్థానంబిది నీదుయిచ్ఛనడుచున్నర్థంబులన్నెప్డు యో
స్వస్థా స్వస్తి లతాతనూవిలసనీ సాయుజ్యదా స్వామినీ
ప్రస్థాపింతువునిష్ఠతోపురములన్ప్రాజ్ఞాత్మికా భ్రామరీ॥ 65

శా॥ ఫాలాక్షజ్వలితాగ్నిభస్మమగునాపంచాస్త్రుజీవించె నీ
లీలాశీర్వచనౌషధంబునసతీ!లెక్కించలేరెవ్వరున్
కాలాతీత కకారకోటిగుణితా కాశీశకాంతామణీ
ఫాలాక్షా ఉర్థశరీరభావసఫలీ భద్రాసనీ భ్రామరీ॥ 66

శా॥ **శ్రీ** శైలంబునమల్లికార్జునయాస్త్రీవైసదా భక్తాళికో
యాశల్తీర్చెడిమాతవై వననిధై యైశ్వర్యదాత్రై నిధై
యాశైవార్చకుధేనువై రసనిధై యార్తిఘ్నవై శాంతివై

యాశాశాసనివైవిశేషఫలదాయైయుంటివో భ్రామరీ॥ 67

శా॥ లంకాధీశుడురావణాసురుడుతా(లక్ష్మీశునోడించ యే
శంకల్లేకనటేశపాదములనోశ్రద్ధాళుడైగొల్చె నీ
వంకన్జూచివరంబునిచ్చెభవుడీవాత్సల్యచూపున్గదా
యంకమ్మన్దుగజాననషణ్ముఖులలీలన్గాంచుచో భ్రామరీ॥ 68

శా॥ లింగమ్బున్దున సూక్ష్మరూపివయి యాలింగార్థమీవైతివో
లింగాన్గీ పరమేశ్వరాశయ విధీ లీలా విలాశేశ్వరీ
లింగాకారమువిశ్వమూర్త్యగుకదా లీనంబు(గావింతు వా
లింగమ్బున్దుననీజగమ్ముల( శివాలింగితా భ్రామరీ॥ 69

శా॥ తారాధీశ సురాధినాయక ఫణీంద్రాదుల్సదా నీపదా
బ్జారాధన్నిరతంబపేక్షడులుపో ప్రాణాంశినీ భార్గవీ
వీరాధీశ్వరి విశ్వనాథునిసతీ విశ్వేశ్వరీ విజ్ఞదా
సారాసారరసాధి నాయకమణీ సాంగత్యమీ భ్రామరీ॥ 70

శా॥ పర్యాలోచనసేయగా స్థిరమతై పాపఘ్నివై ప్రాణమై
శౌర్యాంశమ్మదినీవయై ధర మునీశాధీశ దీప్తాంశివై
ధైర్యమ్మీవయిసర్వజీవులకునాధారంబువైకర్మవై
పర్యాప్తంబుననీవయైనిలుతువోభక్తాళికిన్ భ్రామరీ॥ 71

శా॥ రాజాధీశులురాజరాజులునుయారామాదిదేవాంశులున్
నీజాలమ్మునుదాటలేరుకద!రాణీవౌదువిశ్వమ్ముకు
న్నాజీవమ్మను నీదుసేవలవి విన్నాణెంపు మార్గంబునే
పూజల్సల్పుదు రక్షనిచ్చిపలుకోపుణ్యాంశినీ భ్రామరీ॥ 72

శా॥ **భ**క్తప్రీతికరీపరీక్షసలుపన్భావ్యమ్మెతల్లీమరీ
భక్తాళిన్పలుబాధలెట్టగను? యాపద్బాంధవీవేకదా
వ్యక్తావ్యక్తపదార్థరూపనిగమావ్యర్థంబులేదేది నీ
భక్తిన్సాధనగున్సదా మనమునీబాధేలనే? భ్రామరీ॥ 73

శా॥ **ట**ంకారధ్వనినీధనస్సువెడలన్టక్కుల్యవేడస్సియా
టంకమ్మేమియు కల్గచేయకతమాటల్సాగవన్చెంత్రు రా
టంకుల్వారిరి యుద్ధరంగమున ఘంటానాదినీ ఘర్షిణీ
టంకాలీయుముతారిణీ సతతషట్చక్రాశ్రయా భ్రామరీ॥ 74

శా॥ **టా**లాటోలిలగేల?నీసముఖ మాటేలాడుదుర్మార్గతన్
ఫాలాక్షీక్షణచేత దగ్ధమగుయీపాపాలుపేక్షించుటే
లా?లాగిప్పుడు యుద్ధమందు నరుకన్లంకేయులుద్రేకులన్
బాలా భవ్యముఖీ భవాని భరణీ భాగ్యేశ్వరీ భ్రామరీ॥ 75

*భరణీ= సం.వ్.ఈ.స్త్రీ.1.ఒకనక్షత్రము, 2.భూమి.*

శా॥ **రి**క్తమ్మేలగు నీదు సేవలవి ధర్మేశాని ధన్వంతరీ
భక్తాళిన్కనుమోజయాయభయమీభద్రాయుదాభార్గవీ
శక్తుల్యేలగుమోహపూరితులుయీసాంసారికుల్సదా
శక్తిన్యిచ్చిశరీరమందు ధనమీ సర్వేశ్వరీ భ్రామరీ॥ 76

శా॥ **కా**మేశీ కపిలా కరాళకలనా కామ్యా కపాలీ కళా
కామారిప్రియకామినీ కలనిధీ కాలత్రయీకల్పనా
కామాఖ్యాకమనీయభావమహిమాకారా కపర్దీశ్వరీ
కామేశాశ్రయకాళికా యభయమీ కాలేశ్వరీ భ్రామరీ॥ 77

***కరాళము***=*సం.వి.అ.న.1.నల్లగగ్గెర. 2.వెన్నెముక.*

*పుం.సజ్జరసమునూనె.విణ. 1ఒడ్డుమిట్టయినది.*

*2.పొడవైనది.3.వెరపుఁబుట్టించునది.*

***కల**=ఉభ.స్వప్నము.సం.అ.స్త్రీ. 1ముప్పదికాష్ఠలకాలము*

*2.చంద్రునిలోపదునారవభాగము.3.భాగము.4.స్త్రీరజస్సు.*

*5.మొదలిసొమ్ముపడ్డీ.6.శిల్పము.అ.న.ము. రేతస్సు.*

*విణ. 1.అవ్యక్తమధురము(ధ్వని).2.అజీర్ణము. ఇవి కాక*

*కళలు 64 కలవు.*

***కలనా**=సం.వి.ఆ.స్త్రీ. 1.ఎరుఁగుట.2.పొందుట.*

శా॥ **మ**ధ్యాహ్నంబునసూర్యతాపముననీమంబాచరించీవుయా
సద్యోజాతునిగూర్చితప్తమయితో సాధ్వీమణీ శైలజా
సాధ్యాసాధ్యవిచక్షణాగరిమమీస్వాధీనమైయున్నదో
మధ్యస్థాపరదేవతామధుమతీమాహేశ్వరీ భ్రామరీ॥ 78

శా॥ "**హ**-ర్దసంతమసాపహ-"యనిన నజ్ఞానమ్ముతొల్గించి సౌ
హ-ర్దమ్మదియుఁబెంపుజేసి సఫలమ్మైసర్వకార్యాలు స
ర్వార్థాలిచ్చుచు సర్వదా మనము నిర్వ్యాపారమున్జేసి శ
బ్దార్థజ్ఞానము వస్తువిజ్ఞతయునాపాదింతువో భ్రామరీ॥ 79

శా॥ " **త్రి**స్థేదేవి సరస్వతీ"యనుచునాదివ్యాత్ములందర్ను నీ
యాస్థానౌచితిఁగాంచిముగ్ధులయి నీయాజ్ఞానిబద్ధుల్యగో
త్రిస్థానాధిపతీ మతీ త్రినయనా తేజస్వినీ త్ర్యక్షరీ
స్వస్థా స్వాంతమునందుతల్తెపుడు నీసాయుజ్యమీ భ్రామరీ॥ 80

*త్రిస్థా=ముల్లోకములందుభేదలేకయుండునది.మార్కండేయపురాణమందు ~~ఈ~~విధంగా చెప్పబడినది*

*"మూడులోకాలు.మూడువిద్యలు.ముగ్గురుదేవతలు.మూడగ్నులు.మూడుజ్యోతిస్సులు. త్రివర్గములు.*

*ధర్మత్రయము.మూడుగుణములు.మూడుశబ్దములు.త్రిదోషములు.మూడు ఆశ్రమములు. మూడుకాలములు.మూడు అవస్థలు.పితృత్రయము.అహర్నిశాదులు.మాత్రాత్రయములు ఇవి నీరూపము.*

*ఓదేవీ,సరస్వతీ, ఈ త్రయములన్నీ నీరూపములే"అని.*

*స్వస్థా=దు:ఖము వలన కలుగు చాంచల్యము లేనిది గాన స్వస్థా.లేక స్వ: అనునది అవ్యయము, స్వర్గమును తెల్పును. అట్టి స్వర్గమునకు అధ్యక్షురాలిగా యుండునది. లేక సు-శోభనా-అస్థా-స్థితి,*

*స్థిత్యభావమైన గతి గలది అనగా బాగుగ మఱలని స్థితి గలది అని అర్థము.*

*త్రి నయనా= సోమ,సూర్య,అగ్ని రూపమైన మూడు నేత్రములు గలది.*

*లేదా ప్రత్యక్ష,అనుమాన,శబ్దరూపములైనత్రిధ ప్రమాణములు గలది.*

*1శ్రవణ రూపమైనది శబ్దసంబంధమైన జ్ఞానము.అనగావినుటవలన కలుగునది.*

*2.యుక్తిచే మననము చేయునది  అనుమానము అనగా బాగుగా చింతనచేయునది అని అర్థము.*

*3.ప్రత్యక్షము అనగా స్వానుభవ  రూపమైన నిధిధ్యాసలు.*

*లేదా మూడు మార్గములను పొందించునది, అనగా దక్షిణ, ఉత్తర, బ్రహ్మ మార్గములు  అని మూడు విధములు.*

శా॥ **పుష్టా** పుణ్యనిలయాపురహితాపూజ్యాప్రసిద్ధాపరా
నిష్టాత్ముల్యగువారెనిన్నెరుగునోనిత్యానియంత్రీనిధీ
కాష్టా ఉకాంత కలాత్మికా కమలజా కాత్యాయనీ కామ్యదా
తుష్టిన్యిత్తువు జీవకోటికెపుడున్తుర్యా త్రయీ భ్రామరీ॥      81

*పుష్టా= షట్త్రింశత్తత్వవిగ్రహశీలత్వాత్పుష్టా=36 తత్వములతో కూడిన శరీరము గలదిగాన పుష్ట. లేక అనేక గుణములచే,బ్రహ్మరసముచే,బ్రాహ్మణులచే పుష్టి చెందినది.*

*పరా= పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ అని వాక్కును నాల్గు రూపములుగావర్ణించి నారు.వైఖరీకిముందు*

*రూపము మధ్యమా దీని కన్నముందు పశ్యంతీ ఇంతకన్నముందుయున్నది పరా యనునది అనగా*

*పరా అనగా మూల రూపము యగును.ఇదివాక్కులపరముగా చెప్పబడినది/*

*పరా యనుపదమునకు విస్తృతమైనవ్యఖ్యానము కలదు ఇదిసౌభగ్యభాస్కరం"లలితా సహస్రనామ భాష్యమునందు చూడుము.*

*లేక:- పరా, అత్యుత్కృష్టము. అవ్యక్తబ్రహ్మ(కారణబ్రహ్మ)నుండికార్యబ్రహ్మనాదరూపమైశబ్దబ్రహ*
*్మమై*
*వ్యక్తమగును.అది అనపాయిని.అట్టి పరావాక్కుతో తదాత్మ్యమును పొందినై. పరా రూపిణియైనదేవి.*

*కాష్టా=కాష్ఠా= 18 రెప్పపాటుల కాలమును కాష్ఠ అందురు ఇతర అర్థములును కలవు చూడు- సౌ. భా. భా.*

*అకాంతా= అకమను పాపమును,దు:ఖమును నశింప చేయునది.*

శా॥ **ర**మ్యార్ధమ్ములనిత్తువేసకలసారధ్యమ్మునీస్వంతమో
గమ్యాగమ్యవిచారధీరగమనీకామ్యార్థసంవర్ధినీ
సామ్యమ్మేలగునీదునిర్వహణతోసాధ్వీమణీధీమయీ
సౌమ్యా స్వామ్యము నీయనీవెతగుదో సౌభాగ్యదా భ్రామరీ॥ 82

శా॥ **సుం**దర్యేవనిసుందరేశుడలనీసౌందర్యమీక్షించగా
నందీశాదులవెంటఁబెట్టుకొనియానందమ్మునొచ్చెన్గదా
పందిర్యందుననిన్నుగాంచె తనుశోభారమ్యతాకాంక్షతో
సందేశమ్మునుపంపెపెండ్లికొరకైసంతోషిగా భ్రామరీ॥ 83

శా॥ **ద**ధ్యన్నంబనయిష్టమౌననగయాదధ్యన్నమేపెట్టెదో
మిథ్యారూపమగీజగత్తునకుసామిత్వమ్మువహ్యించియా
మిథ్యాదృష్టులయూహలన్నియునుయామృత్యుజ్జయున్కిత్తువో
సాధ్యాసాధ్యములన్నినీకడనుయాశల్వీడునో భ్రామరీ॥ 84

శా॥ **రీ**తుల్యేవియుతెల్యనమ్మనినుయర్చించన్సదాశైలజా
జ్ఞాతుల్సేయువిరోధకార్యములువిఘ్నాలెన్నొకల్గించెయే

రీతిన్నైనరిగట్టి విఘ్నమునివారించీవు రక్షించుమా
దాతల్లేరుగ నిన్నుమించు సురలేతావందునో భ్రామరీ॥ 85

శా॥ దేవీనీదుకటాక్షవీక్షణలచేదేహంబుపుష్ట్యొందు మా
యావేశమ్మునశించునజ్ఞతయుదూరంబౌనుశక్త్యొచ్చుయో
త్రోవన్గల్గుసదార్థవిజ్ఞతయుసంతోషంబుకల్గెప్డు నీ
సేవల్జేసెడిభాగ్యమియ్యుమికవిశ్వేశాశయా భ్రామరీ॥ 86

శా॥ వర్ణించన్గ పదాలు చాలవుగదా వాగీశ తన్వర్ధినీ
వర్ణాలేవియునీదురూపమలభావాబ్జంపుపత్రాలపై
నిర్ణీతార్థమువచ్చునట్లుగనువర్ణింతేౕమొచిత్రించగా
పూర్ణాకారమదెట్లుతెల్యనగునోపుణ్యాంగినీ భ్రామరీ॥ 87

శా॥ తారానాయకశక్తివైదినకరాద్యాదుల్బలంబీవుయై
పారావారసమంబునౌజగతి మాప్రాణంబురక్షింతువే
తారాభూషవిలాసినీ తరణి తారా తారిణీ ధర్మిణీ
యారాధ్యా యరిమర్ధినీ యనిమిషా యానందినీ భ్రామరీ॥ 88

శా॥ ఐశ్వర్యాదిఫలాదిదాతవణిమాద్యైశ్వర్యసంధాయినీ
విశ్వాత్మా విమలా విశేషఫలదా విద్యాధరీ విస్మృతా
విశ్వాకారి విదేహి విశ్వనిలయా వీణాధరీ వైష్ణవీ
విశ్వాసమ్ముగయుంటినమ్మవినవో విజ్ఞాపనం భ్రామరీ॥ 89

శా॥ నవ్యమ్మౌనుగదాసదా సదమలానందాశ్రయా నాదినీ
దివ్యౌషధ్యగునీపదస్మరణమోదీక్షన్వలెన్సాగగా
శ్రావ్యమ్మైనసుగీతిమాదిరిగనాస్వాదింపనిత్యమ్మవో
యవ్యక్తంబగు దివ్య సిద్ధి కలుగో యాహ్లాదినీ భ్రామరీ॥ 90

శా॥ **మ**ంత్రాధీశ్వరివీవు యక్షరసమూహంన్నీదుయిచ్ఛాక్రియే
యంత్రించున్గద సర్వశబ్దముల మాయారూపిణీ మర్మిణీ
యంత్రాంతర్గత శక్తి తంత్రగతి నీయాజ్ఞల్సదాలించునో
మంత్రంతంత్రముయంత్రమంతయునునీమాహత్మ్యమేభ్రామరీ॥ 91

శా॥ **హ**ర్షమ్మీవు సకాలవిజ్ఞతవు మహ్యందీవు మాతల్లివై
వర్షమ్మై యిలసస్యసంపదవునై వ్యాక్కై ప్రజాశక్తివై
హర్షాంశమ్మునునీవయైజనులకాహ-రంబునిచ్చు యా
కర్షించేటిహలంబువైనిరతమున్కామ్యంబునీ భ్రామరీ॥ 92

శా॥ **ము**ఖ్యాముఖ్య విశేష విద్యలవి నీమూలంబునేవచ్చు నీ
సఖ్యంబందున రానివిద్యల్గలవే సర్వార్థదాత్రీస్మృతీ
యాఖ్యేయంబదియేమిలేదుయికనీయాశిస్సులన్కోరెదో
సౌఖ్యంబిచ్చు ధనంబునీయుమికనో సౌశీల్యదా భ్రామరీ॥ 93

శా॥ **లు**ప్తంబయ్యెనపూర్వశక్తులవి యేలోపంబునో నెర్గనే
జ్ఞప్తందున్కనరాదు దేవి మదినజ్ఞానంబుతొల్గించవే
గుప్తజ్ఞానమునిచ్చి శీఘ్రముగ బాగోగుల్నివీక్షించు మా
ప్రాప్తంబంతయునీదుపాయనమె యంబా ఉశిస్సులీభ్రామరీ॥ 94

శా॥ **గు**ర్వుల్లేరిట నీదయన్గలుగ నోగుర్వేలనమ్మాయికన్
సర్వేశాని సదాశివాత్మవగు నీశాస్త్రజ్ఞతీయమ్మరో
గర్వాంధుల్ఘనపాశబద్ధులయియోగజ్ఞానసాహిత్యము
న్నేర్వన్నేరనివారుగుర్వులగునే?నిర్ణాయకీ భ్రామరీ॥ 95

శా॥ **వి**ద్యావిద్యసురూపిణీ వితరణీవిద్యాధరీపాహిమాం
విద్యాదాయి వినోదినీవిలసితావేద్యాదిచారిత్రకీ

సద్యోమంథజ మానసీసమరసా సామర్థ్యనీ స్వామినీ
సద్యోజాతసమానమానసరసాస్వాధ్యాయినీ భ్రామరీ॥ 96

శా॥ **శ్వ**శ్రేయస్సునుకల్గజేతువని విశ్వాసాత్ముల్లైదేవతల్
విశ్రాంతేమియు లేక(గొల్చితిరి నిన్విద్యార్థులై నిత్యము
నీ్యశ్రోతాగ్నులునీస్వరూవములెయౌనిష్కారణానిర్మలా
యోశ్రీశైలనివాసినీసిరిమతీసౌభాగ్యదా భ్రామరీ॥ 97

శా॥ **నా**నాదేశవిలాసినీనయకరీన్యాయాధికారీమణీ
నీనాభేదములేవిలేనితరుణీనీలేశ్వరీనిర్వృతీ
నానారూపవిశేషిణీ నమసితా నాందీకరీ నాయకీ
పానాపానవిచారిణీప్రణవనీప్రావీణ్యదా భ్రామరీ॥ 98

శా॥ **ధా**వళ్యాంశిని దామినీ దమవతీ ధర్మాత్మికా ధారిణీ
భావాభావవివర్జితాభగవతీభద్రప్రియాపాహిమాం
భావజ్ఞా భవనాశినీ బలకరీ భవ్యాత్మికా భార్గవీ
భావంబందుననిల్చివాగ్రసౌభాగ్యమీ భ్రామరీ॥ 99

శా॥ **రా**సీభూతదయావిశేషవరదా రాకేందుబింబాననా
వాసవ్యాదిసురాధినాయకమణీ వాత్సల్యవాగ్దాయినీ
వ్యాసాధీశమునీంద్రసేవితపదా వామేశతన్వర్థినీ
వాసమ్మీయముభోగ్యవస్తువులైవర్ధిల్లగా భ్రామరీ॥ 100

శా॥ **ధ్యా**తవ్యాంశి సదామనంబు(మననధ్యానమ్ముగావించెద
న్మాతా సంతతిపెంపునొందునటులాశల్తీర్చి దీవించుమా
రాతల్మార్చెదవీవుతల్చుకొనదుర్గాదు:ఖవిధ్వంశినీ
స్వాతంత్ర్యమ్మదినీదుసొత్తుకద నీసామీప్యమీ భ్రామరీ ॥ 101

శా॥ **కృ**త్యాకృత్యలునీదుయాజ్ఞలకునాకృష్టుల్యయుండెప్డు వో
నిత్యానిత్య పదార్ధ ధర్మనిగమా నిత్యార్ధ నిర్ధారిణీ
సత్యాసత్య కళాప్రపూర్ణ గమనీ సత్యార్ధ సంపత్కరీ
నిత్యమ్మేనిటసల్పెదమ్మజపమున్నిష్టాత్ముడై భ్రామరీ ॥ 102

శా॥ **త**ంత్రాతీతవిధాతరాతవల తత్వజ్ఞానమీవిచ్చి ని
స్తంత్రజ్ఞానవిధానమార్గములశాస్త్రార్థాలశక్తిమ్ము దు
స్తంత్రజ్ఞుల్నిదమించిమానసమునన్శాంతిచ్చిరక్షించి యా
మంత్రార్థం మదినిల్పి నిర్జడునిగా మన్నించవేభ్రామరీ॥ 103

శా॥ **మీ**రన్నేరరు నీదుయాజ్ఞలను స్వామిత్వమ్ముచెల్లెప్డు నె
వ్వారున్గాని యనిర్జనిర్జరులు నీవాజ్ఞీయపాటింతుగా
లేరెవ్వారునువిశ్వమందుననుకాళీ కాలకంఠేశ్వరీ
వీరాశంసనమందుగెల్వనినువిశ్వేశాశయా భ్రామరీ ॥ 104
వీరాశంసనము=భయంకరమైనయుద్ధభూమి

శా॥ **శ**స్త్రాశస్త్రవిశేషవిజ్ఞతలు నీస్వంతమ్ముతల్లీకనన్
శస్త్రార్థమ్మును కల్గజేసినను నోశాస్త్రజ్ఞునిన్జేయుమా
యస్త్రజ్ఞానమునిమ్మునర్థమునుయిమ్మస్త్రేశ్వరీయంబికా
శస్త్రాస్త్రజ్ఞాననియంత్రకీయవికలా ఉవ్యక్తాంశినీ భ్రామరీ॥ 105

శా॥ **త**త్వాతీతము నీపదాశ్రయము శాంతాకారిణీ శాశ్వతీ
తత్వజ్ఞానముకల్గజేయునుసతీధ్వాంతమ్ముశాంతించునో
తత్వాధిక్యవునీదుసన్నిధదినిత్యానందమిచ్చున్సదా
తత్వమర్థసురూపిణీతరణివోతత్వాసనా భ్రామరీ॥ 106

శా॥ **క**ర్మజ్ఞానము కల్గజేసి మది మోక్షార్థమ్ము సాధించగా
మర్మమ్మంతయుదెల్పిమాయయనుసీమాంతమ్ముదెల్పీవుయీ

కర్మాకర్మ ఫలంబదేమియును నాకాయాసమీకుండ జే
సిర్మాధర్మము దెల్పి మాకులముకాశీర్వాదమీ భ్రామరీ ॥ 107

శా॥ **ము**క్తిన్నీయగశక్తినీవెయనినీముందుంటినమ్మాయికా
సక్తిన్నీవు పరీక్ష సల్పినచొ నే శక్తున్యగెట్లంటినే
యుక్తమ్మేయిదినీదుభక్తునికివోయుక్తిన్యిచ్చి గావంగదే
యుక్తాయుక్తవిచక్షణాయుగకరీయోజించుమా భ్రామరీ ॥ 108

ఏతత్ మత్ హృయోధ్యాన విరాజమాన వికసిత సువాసనాభరిత నవనవోన్మేష భావవిలసిత అష్టోత్తర దివ్యకుసుమాని ఓంకారాశ్రయశ్రీశ్రీశైలమల్లికార్జునతన్వర్థస్థిత తేజోవిరాజిత ప్రభాభాసమానభ్రమరాంబికా దేవ్యా: దివ్యపాదారవిందార్పణమస్తు
ఇతిశం
11-9-2010. శనివారం రాత్రిగం.11:05ని.లకు పూర్తి అయినది.

శ్రీశ్రీశైలజ్యోతిర్లింగగర్భసంజనిత వేమనారాధ్యవంశపారంపర్యాగత షట్కాలశివపూజా ధురంధర కౌండిన్య గోత్రోధ్భవ ములుగు నాగలింగారాధ్య ప్రపౌత్ర: విశ్వనాధారాధ్య పౌత్ర: దుర్గప్రసాధారాధ్యపుత్ర: విశ్వనాధారాధ్య కృత భ్రమరాంబికా స్తవం సంపూర్ణం.